రదత్త గ్రంథమాల-చతుర్థ పుష్పము

శ్రీ హొస్సూరి రామారాధ్యేశ్వరారాధ్యాం నమః

# శ్రౌత శైవ సంధ్యావందనము

(ఋక్, యజుర్వేదులకు)



సంకలనము :

**శివశ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు**

ఇయ్యది

శ్రౌత శైవ (ఆరాధ్య) మహాజనుల సదుపయోగార్థము
వైదిక బ్రాహ్మణుల పరిగ్రహార్థము శివప్రీతి నభిలషించి వ్రాయబడినది

**దుర్మతి సం॥ చైత్ర శు॥ దశమి, సోమవారము**

 **13-4-1981** వెల రూ. 2-00



**శ్రీ బెల్లపు లక్ష్మీనరసింహారావుగారు**

42 సం॥ వయస్సు

ఇంటి నెం. 10/11, రామకృష్ణా భవన్,
జనరల్ బజార్, సికింద్రాబాద్-500 003.

| | | |
|---|---|---|
| గోత్రము | : | చిదురువెళ్ళ |
| తండ్రి పేరు | : | బెల్లపు రామకృష్ణయ్య |
| తల్లి పేరు | : | వరలక్ష్మి |

భార్య పేరు : సౌభాగ్య శ్రీమతి జనాబాయి
కుమారులు : 1. రామకృష్ణ
2. శివకుమార్
కుమార్తెలు : ఐదుగురు

బట్టల వర్తకము, ఇత్తడి వ్యాపారము, చిట్ ఫండు ప్రధానము.

వీరు - ఈ గ్రంథమును వ్రాయుటకు నన్ను ప్రోత్సహించిన వారిలో అగ్రగణ్యులు. వర్తకులలో ప్రముఖులు. సరళస్వభావము, సరసహృదయముగలవారు, వెల్లం వంశాంబుధి రాకా సుధాకరుడు, ప్రాత శైవ (ఆరాధ్య) మహాజనుల యందు భక్తి శ్రద్ధలు గలవారు. సత్కు-టుంబములో సమరస ప్రవర్తనములో కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుచు అనేక ధర్మ సంస్థలకు విరాళముల నొసంగి ధన్యజీవనులగు లక్ష్మీ నరసింహారావుగారు ఈ గ్రంథమునకు అడుగకయే తమవుగా గొప్ప విరాళమును సమర్పించిరి. వీరికి వీరి కుటుంబమునకు శ్రీ పార్వతీ రాజరాజేశ్వరులు-సర్వతోముఖాభివృద్ధిని నిరంతరము ప్రసాదించి దీర్ఘాయు రారోగ్య భాగ్యముల నిచ్చియు ఎల్లకాలము రక్షించుగాక!

# శ్రీ కీ. శే. దొంతుల (రేగుంట) హనుమాండ్లు
# పూజ్యశ్రీ రాలు - నర్సుబాయి, (వైశ్యదంపతులు.)

శ్రీ హనుమాండ్లు గారు — మెటుపల్లి యందు పవిత్ర ఆదర్శజీవనమును గడిపిన వైశ్యశిఖామణి యని చెప్పవచ్చును. వీరు తండ్రి తాతల సదాచారమును పాటించుచు వంశ — గురువులగు మాచెంత మంత్రోపదేశమును పొంది ఇహపరములను సాధించిన మహనీయుఁడు. వీరి సతీమణి — నర్సుబాయి — మహాసాధ్వి; ఈమె ఆరుగురు కుమారులను ఒక్క కుమార్తెను కని వారిని పెంచి పెద్దఁజేసి ఓర్పుతో నేర్పుతో కుమారుల చెంత — తన శేష జీవితకాలమును సార్థకముఁజేసుకొనుచున్నది.

ఆరుగురు కుమారులలో జ్యేష్ఠుఁడు నిండు యౌవనమున మరణించెను. మిగత ఐదుగురు నారాయణ, రామచంద్రం, బుచ్చయ్య, రామేశం, లక్ష్మణ గుప్తగారలు; పరస్పర సామరస్యముతో విభాగమును చెంది (వేరుపడి) నను సోదరస్నేహముతో బుద్ధిమంతులై న్యాయముగ వర్తకముఁజేయుచు భార్యాపుత్రసమేతులై మంచి పేరు గలిగియున్నారు.

ఇట్టి వీరు — తమ తండ్రిగారి జ్ఞాపకార్థము ఈ గ్రంథమునకు గొప్ప విరాళము నొసఁగిరి. పార్వతీరాజ రాజేశ్వరులు — వీరికి వీరి భార్యలకు పుత్రికాపుత్రులకును దీర్ఘాయు రారోగ్యభాగ్యములనుకలుగఁజేయుచు ఎల్లకాలము రక్షించుగాక !

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# ఉపోద్ఘాతము

శైవ మహాజనులారా !

శ్రౌత శైవులు (ఆరాధ్యులు) వారి శిష్యులు ప్రతిదినము ఆచరింపవలెనైన వైదిక విధానములలో సంధ్యావందనము ముఖ్యమగుటచే శైవులకు వైదికత్వము నాపాదించుటకు ప్రథమ సాధనమగుటజేసియు శ్రౌతశైవ సంధ్యావందనము శైవులకు అత్యవసరమని తోచినందున మహోపాధ్యాయులు శతాధిక గ్రంథకర్తలు శ్రౌతశైవాగ్రగణ్యులు నగు శివశ్రీ శివయోగి, ముదిగొండ నాగలింగశాస్త్రి ఆరాధ్యుల వారి ఆహ్నిక విధినుండియు బొంబాయి నిర్ణయసాగర్ వారి ఋగ్వేదీయ బ్రహ్మకర్మ సముచ్చయమునుండియు సంకలనము నొనర్చి సిర్దుష్టముగ వ్రాసితిని.

ఋగ్వేదులకు "ఋ" అనియు, యజుర్వేదులకు "యజు" అనియు గుర్తు లీయఁబడినవి.

ఇతరులు చెప్పెడు గాయత్రీ మంత్రార్థ శ్లోకమును మనవారు "దేవస్య సవితు ర్మ ధ్యే" ఇత్యాది రీతిని చదువవలెను.

శ్లోకార్థము: సూర్య దేవునితో నుండు ఏ భర్గుఁడు (పరమేశ్వరుఁడు) మా బుద్ధులను - ఉపాసనాక్రమముగ ప్రేరేపించునో. సర్వోత్కృష్టుఁడగు అట్టి పరమేశ్వరు నుపాసించుచున్నాము.

ఈ శ్లోకమును గాయత్రీ మంత్రార్థముగ యోగయాజ్ఞవల్క్య మహర్షి నిరూపించెను. మరియు పరులు "శివాయ విష్ణురూపాయ" మొదలగు శ్లోకములను కల్పించి సంధ్యావందనములో చెప్పిరి. శ్రౌతస్మార్తైననో కల్పిత శ్లోకములను విడనాడి సూత సంహితలో యజ్ఞవైభవ ఖండమునందు ఉపరిభాగమున సూతగీతయందును వ్రాయఁబడిన శివ పారమ్య శ్లోకములను పఠింపవలెనని యిందు నుదాహరింపవలసి వచ్చెను.

శివ నామములతో ఆచమనముఁ జేయుట. విష్ణు నామములకన్న శ్రేష్ఠమని భావించి ఇందు శంభు శంకరాది నామములు 24 వ్రాయఁబడినవి. మార్జనాది స్థలములయందు పంచబ్రహ్మ మంత్రములు మున్నగు వానిని గమనింతురుగాక! ఇట్టి విశేషములతో వార్ధకమును సరకు సేయక వ్రాయఁబడిన ఈ సంధ్యావందనమును శైవులు ఆదరించి ఆచరింతురుగాక!

గ్రంథకర్త

ఓమ్

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# శ్రౌత శైవ సంధ్యావందనము

(ఋక్ యజుర్వేదములలో)

"శివ శివ" యనుచు తెల్లవారునప్పుడు మేలుకొని ఇష్టలింగమును కనులం కద్దుకొని కాలు సేతులు కడిగికొని పొడి విభూతిని నొసటం దాల్చియు ప్రాతః స్మరణ శివస్తోత్రముం జదువవలెను. తరువాత కాలకృత్యములం దీర్చుకొని మంచినీటితో స్నానము నొనర్చి శుభవస్త్రముం గట్టుకొనియు తూర్పుముఖముగ నుత్తరముఖముగనైనను మంచిచోట ఆసనముపై కూర్చుండి భస్మరేఖలు పెట్టుకొనవలెను.

చెంబు గ్లాసు ఉద్ధరిణి పళ్లెరములు ముందుంచుకొని ఆచమనమును చేయవలెను. ఆచమనమునకు ముందు దిగువ శ్లోకముం జదువుచు, పరమేశ్వరుని స్మరింపవలెను.

శ్లో॥ అపవిత్రః పవిత్రో వా - సర్వావస్థాం గతోఽపి వా।
యః స్మరేద్దేవ మీశానం - స బాహ్యాభ్యంతరః శుచిః॥

శివ ! శివ ! శివ !

## ఆచమనము

| | |
|---|---|
| ఓం కేశవాయ స్వాహా<br>ఓం నారాయణాయ స్వాహా<br>ఓం మాధవాయ స్వాహా | అని ముమ్మారు ఉదకము పుచ్చుకొనవలెను. |
| గోవిందాయ నమః<br>విష్ణవే నమః | అని చేతులు కడిగికొనవలెను. |

స్థాణవే నమః, భవానీపతయే నమః, భూతేశాయనమః, త్రిపురాంతకాయ నమః, త్రిణయనాయ నమః, శ్రీ కంఠాయ నమః, కాలాంతకాయ నమః, శర్వాయ నమః, ఉగ్రాయనమః, అభవాయ నమః, భర్గాయనమః, భీమాయ నమః, జగతాంనాథాయ నమః, అక్షయాయ నమః, త్రిపురారయే నమః, రుద్రాయనమః, ఈశానాయ నమః, మహేశాయ నమః, ఈశ్వరాయ నమః, మహాదేవాయ నమః,

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః - యే తే భూమిభారకాః।
ఏతేషా మవిరోధేన - బ్రహ్మకర్మ సమారభే॥

## ప్రాణాయామము

"ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా, దైవీ గాయత్రీ చ్ఛందః సప్తానాం వ్యాహృతీనాం విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌత

మాత్రి పనిషత్కశ్యపా ఋషయః; అగ్నివాయ్వాదిత్య బృహస్పతి వరుణేంద్ర విశ్వేదేవా దేవతాః, గాయత్ర్యుష్ణిగనుష్టు బృహతీపంక్తిత్రిష్టుబ్జగత్యశ్ఛందాంసి; గాయత్ర్యా విశ్వామిత్ర ఋషిః; సవితా దేవతాః; గాయత్రి చ్ఛందః; గాయత్రీశిరసః ప్రజాపతి ఋషిః; బ్రహ్మాగ్నివాయ్వాదిత్యాదేవతాః; యజుశ్ఛందః; ప్రాణాయామే వినియోగః, (ఇద్దానిని ఋగ్వేదులు మాత్రము పఠింపవలెను.)

ఓం భూః, ఓం భువః, ఓంసువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓ (గ్)ం సత్యం; ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్, ఓం మాపోజ్యోతీ రసోఽమృతం, బ్రహ్మభూర్భువస్సువరోమ్.

అనుచు అంగుళములతో నాసికాగ్రమును పట్టుకొని ఎడమ ముక్కుతో ఊపిరి పీల్చుకొని కొంతతడవు నిలిపి కుడిముక్కులో ఊపిరి విడువవలెను. ఇది ప్రాణాయామమగును.

## సంకల్పము

శ్రీ శివ! శివ! శంభో ర్రాజ్ఞయా మహావిష్ణో ర్నాభికమలే సంభూతస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత

మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య (వాయవ్య) ప్రదేశే కృష్ణా (గంగా) గోదావర్యోర్మధ్యదేశే శివ గురుచరణ మాహేశ్వర సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .... సంవత్సరే .... అయనే ... ఋతౌ .... మాసే .... పక్షే .... తిథౌ వాసరే, శుభయోగే శుభకరణే ఏవంగుణ విశిష్టే శుభే అభ్యుదయముహూర్తే శ్రీమాన్ .... గోత్రః .... శర్మా .... (ధర్మపత్నీసమేతః) అహం, శ్రీమతః ... గోత్రస్య .... శర్మణః (ధర్మపత్నీసమేతస్య) మమ ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం ... సంధ్యా ముపాసిష్యే. (సంధ్యాం కరిష్యే)

## మార్జనము

ప్రశస్తజలమును గాయత్రీ మంత్రముచే నభిమంత్రించి ఆ యుదకమును "ఆపోహిష్ఠా" మొదలగు మంత్రములఁజదువుచు శిరమునఁజల్లుకొనవలెను. ఋ. ఆపోహిష్ఠేతి తృచస్య అంబరీషః సింధుద్వీప ఋషిః ఆపోదేవతా, గాయత్రీ ఛందః మార్జనే వినియోగః

## మార్జనమంత్రము

ఓం ఆపోహిష్ఠా మయోభువః, తాన ఊర్జేదధాతన । మహేరణాయ చక్షసే, యోవః శివతమోరసః, తస్య భాజయతేహనః। ఉశతీరివమాతరః,

తస్మా అరంగమామవః, యస్యక్షయాయ జిన్వథ, ఆపోజనయథా చనః॥

మరియు

ఓం సద్యోజాతం ప్రపద్యామి, సద్యోజాతాయ వై నమో నమః, భవేభవే నాతిభవే భవస్వమాం, భవోద్భవాయ నమః॥ ఓం వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయ నమో బలవికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమః సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః॥ ఓం అఘోరేభోథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః, సర్వేభ్యః సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥ ఓం తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్॥ ఓం ఈశానః సర్వవిద్యానా - మీశ్వరః సర్వభూతానాం, బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మా, శివోమే అస్తు సదాశివోమ్॥

## మంత్రాచమనము

ఋ. సూర్యశ్చేతిమంత్రస్య యాజ్ఞవల్క్య ఉపనిషద ఋషిః, సూర్యమన్యు మన్యుపతి రాత్రయో దేవతాః, ప్రకృతిశ్ఛందః, అభ్యంతర శుద్ధ్యర్థే మంత్రాచమనే వినియోగః.

ఓం సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షంతాం, యద్రాత్ర్యా పాప మకార్షం, మనసా వాచా హస్తాభ్యాం, పద్భ్యాముదరేణ శిశ్నా, రాత్రి స్తదవలుంపతు, యత్కించ దురితం మయి, ఇద మహం మామమృతయోనౌ, సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥ ఉదకము పుచ్చుకొనవలెను.

## మధ్యాహ్నకాలమంత్రాచమనము

ఋ. ఆపః పునంత్విత్యస్య అనువాకస్య నారాయణ యాజ్ఞవల్క్య ఋషిః, ఆపోదేవతా, పృథివీ బ్రహ్మణస్పతి రష్టీ, మంత్రాచమనే విని యోగః

ఓం ఆపః పునంతు పృథివీం, పృథివీ పూతా పునాతు మాం, పునంతు బ్రహ్మణస్పతి ర్బ్రహ్మ పూతా పునాతు మాం, యదుచ్ఛిష్ట మభో జ్యం యద్వా దుశ్చరితం మమ, సర్వం పునంతు మామాపో సతాంచ ప్రతిగ్రహగ్ం స్వాహా॥ అనుచు ఉదకము పుచ్చుకొనవలెను.

## సాయంకాల మంత్రాచమనము.

ఋ. అగ్నిశ్చేతి మంత్రస్య యాజ్ఞవల్క్య ఉపనిషద ఋషిః, అగ్ని మన్యు మన్యు పత్యహాని, దేవతాః, ప్రకృతిశ్ఛందః, మంత్రాచ మనే వినియోగః.

ఓం అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః, పాపేభ్యో రక్షంతాం, యదహ్నా పాప మకార్షం, మనసా వాచా హస్తాభ్యాం, పద్భ్యాముదరేణ శిశ్నా, అహ స్తదవలుంపతు, యత్కించ దురితం మయి, ఇద మహం మా మమృతయోనౌ, సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥

తరువాత ఈ మూడు వేళలయందు "శంఖవె స్వాహా" ఇత్యాది నామములతో ఆచమనముఁజేయవలెను.

## ద్వితీయమార్జనము

ఋ. ఆపోహిష్ఠేతి నవర్చస్య సూక్తస్య అంబరీషః సింధుద్వీప ఋషిః, ఆపోదేవతా, గాయత్రీ చ్ఛందః, పంచమీ వర్ధమానా, సప్తమీ ప్రతిష్ఠా, అంత్యే ద్వే అనుష్టుభౌ, పున ర్మార్జనే వినియోగః.

ఋ. ఓం ఆపోహిష్ఠేతి మంత్ర ముచ్చార్య అనంతరం "శన్నో దేవీ" ఇత్యాది పఠేత్. ఓం శన్నోదేవీ రభిష్టయ ఆపోభవంతు పీతయే, శంయోరభిస్రవంతునః ఈశానా వార్యాణాం క్షయంతీ శ్చర్షణీనాం, అపో యాచామి భేషజం, అప్సుమే సోమో అబ్రవీ దంతర్విశ్వాని భేషజా, అగ్నించ విశ్వశంభువం, ఆపః పృణీత భేషజం, వరూథం తన్వే౩ మమ,

ఊర్ష్వ శిరస్కం స్పృశే, ఇద మాపః ప్రవహత, యత్కించ దురితం మయి, యద్వాహ మభిదుద్రోహ, యద్వా శేప ఉతానృతం, ఆపో అద్యాన్వ చారిషం, రసేన సమగస్మహి, పయస్వా నగ్న ఆగహి తం మాసం సృజ వర్చసా"

దధి. ఓం దధి క్రావ్ణ్ణో అకారిషం, జిష్ణో రశ్వస్య వాజినః, సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥

ఆపోహిష్ఠేతి మంత్రానంతరం "హిరణ్యవర్ణా" ఇతి పఠేత్.

ఓం హిరణ్యవర్ణా శ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యాస్వింద్రః అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తాన ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు, యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యం జనానాం మధుశ్చుతశ్శుచయోయాః పావకా స్తాన ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంత రిక్షే బహుధా భవంతి, యాః పృథివీం పయసోందంతి శ్శుక్రాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనా భవంతు॥ శివేన మా చక్షుషా పశ్యతాప శ్శివయా తనువోపస్పృశత త్వచం మే, సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదో హువేవో మయి వర్చో బల మోజో నిధ త్త॥

## అఘమర్షణము

ఋ.    ఋతం చేతి తృచస్య మాధుచ్ఛందసోఽఘమర్షణ ఋషిః భావవృత్తో దేవతా అనుష్టుప్ ఛందః, అఘమర్షణే వినియోగః.

ఋ.    ఓం ఋతంచ సత్యంచాభీద్ధాత్తపసోఽధ్యజాయత, తతో రాత్ర్యజాయత, తతః సముద్రో అర్ణవః సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత, అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ, సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్, దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః.

యజు. ఓం ద్రుపదాదివ ముంచతు, ద్రుపదాదివేన్ముముచానః, స్విన్నః స్నాత్వా మలాదివ, పూతం పవిత్రేణేవాజ్యం, ఆపః శుంధంతు మైనసః॥

జలమును "ఓం హాం అస్త్రాయనమః" అను అస్త్రమంత్రముతో ఎనిమిదిమారులు, గాయత్రీ మంత్రముతో పదిమారులు నభిమంత్రించి యా జలమును బొటనవ్రేలుతో అనామిక వ్రేలులోడను శిరమున ముమ్మారు- అస్త్రమంత్రము చదువుచు- చల్లుకొని మిగిలిన నీటిని ఎడమ ముక్కున వాసనఁ జూచి ఆ జలము-లోనికి పోయినట్లు పడి

ముక్కునుండి వెలువడినట్లును భావించి ఎడమవైపున నేలపై వజ్రశిల యున్నట్లు ధ్యానించి తదుదకమును శిలపై పడవేసియు పాపపురుషుడు నశించినట్లు భావింపవలెను. ఇదియే అఘమర్షణ మగును.

తరువాత "శంభవే స్వాహా" ఇత్యాది నామములతో అచమన విధి నొనర్పవలెను.

## అర్ఘ్య ప్రదానము

ఋ. ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః, పరమాత్మా దేవతా, దైవీగాయత్రీ చ్ఛందః, వ్యాహృతీనాం పరమేష్ఠి ప్రజాపతిః ప్రజాపతి ర్బృహతీ, గాయత్ర్యా విశ్వామిత్రః సవితా గాయత్రీ, సూర్యాత్మనే శివాయ అర్ఘ్య ప్రదానే వినియోగః.

ఆచమ్య ప్రాణా నాయమ్య పూర్వోక్త ఏవం గుణ విశిష్టే శుభే అభ్యుదయ ముహూర్తే శ్రీమాన్ ........ గోత్రః ........... శర్మాభిధేయోఽహం, శ్రీమతః ........... గోత్రస్య, ............... శర్మాభిధేయస్య మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతఃసంధ్యాంగ మర్ఘ్య ప్రదానం కరిష్యే.

ఓం భూర్భువస్సువః, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్॥

ఓం శివాస్త్రాయ విద్మహే- కాలానలాయ ధీమహి,
తన్నో అస్త్రః ప్రచోదయాత్॥

అనుచు గంధపుష్పాక్షతలతో కూడిన అర్ఘ్యోదకమును ముమ్మారు సూర్యాత్మయగు శివునకు ఒసంగవలెను. కాలాతిక్రమదోష పరిహారార్థం చతుర్థార్ఘ్య ప్రదానం కరిష్యే అనుచు నాలుగవమారు అర్ఘ్యము నొసంగ వలెను.

## మధ్యాహ్న కాలమున

ఋ. హంసః శుచిష దితి మంత్రస్య గౌతమో వామదేవ ఋషిః, సూర్యో దేవతా, జగతీ ఛందః సూర్యాత్మనే శివాయ అర్ఘ్యప్రదానే వినియోగః.

ఓం హంసః శుచిష ద్వసు రంతరిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్, నృషద్వర సదృత సద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతమ్. శ్రీ సూర్యాత్మనే శివాయ ఇదమర్ఘ్యం సమర్పయామి

అనుచు ఒకమారు, గాయత్రీ మంత్రముతో రెండుమారులు, కాలాతిక్రమమునకు ఒకమారు నర్ఘ్యము నొసఁగవలెను.

ఓం భవం తర్పయామి ఓం మృడం తర్పయామి ఓం హరం తర్పయామి అనుచు ముమ్మారు తర్పణముఁ జేయవలెను.

సాయంకాలమున

ఆచమ్య ప్రాణానాయమ్య, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సాయంసంధ్యాంగ మర్ఘ్య ప్రదానం కరిష్యే, ఇతి సంకల్ప్య గాయత్రీ మంత్రేణ త్రివారం సూర్యాత్మనే శివాయ అర్ఘ్యం కాలాతిక్రమే చతుర్థార్ఘ్యం చ దద్యాత్. గాయత్రి మంత్రములో ముమ్మారు,సంధ్యాకాలము దాటినచో నాలుగవమారు నర్ఘ్యము నొసఁగవలెను.

ప్రదక్షిణ మంత్రము

యజు. ఉద్యంత మస్తంయంత మాదిత్య మభిధ్యాయన్కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ త్సకలం భద్ర మశ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి, య ఏవంవేద

## సంధ్యోపాసనము

"అసా వాదిత్యో బ్రహ్మ" ఇత్యాత్మానం ప్రదక్షిణం పరిషిచ్య అప ఉపస్పృశేత్.

(సూర్యున కంతర్యామియగు పరమేశ్వరుడే పరబ్రహ్మ యని యుద్దేవుని ధ్యానించుటచే బ్రాహ్మణ్యమును నిలుపును. అట్టిదే సంధ్యోపాసన మగునని ధర్మశాస్త్రములయందు గలదు)

## తర్పణము

యజుర్వేదులు మాత్రము—

ప్రాతఃకాలమున : సంధ్యాం తర్పయామి గాయత్రీం తర్పయామి
బ్రాహ్మీం తర్పయామి నిమృజీం తర్పయామి.

మధ్యాహ్నమందు : సంధ్యాం తర్పయామి సావిత్రీం తర్పయామి
రౌద్రీం తర్పయామి నిమృజీం తర్పయామి.

సాయంకాలమున : సంధ్యాం తర్పయామి సరస్వతీం తర్పయామి
వైష్ణవీం తర్పయామి నిమృజీం తర్పయామి
గాయత్రీ జప విధానము.

శుద్ధోదకముతో జపస్థానమును సంప్రోక్షించి "ఓం భూర్భువః స్వరోమ్" అని యుచ్చరించి ఆసనముపై పద్మాసనముతో కూర్చుండవలెను.

## ఆచమ్య ప్రాణానాయమ్య

ఋ. పృథ్వీతి మంత్రస్య మేరుపృష్ఠ ఋషిః, కూర్మో దేవతా" సుతలం ఛందః ఆసనే వినియోగః.

ఓం పృథివి త్వయా ధృతాలోకా- దేవి త్వం విష్ణునా ధృతా।
త్వం చ ధారయ మాం దేవి- పవిత్రం కురు చాసనమ్॥
ఊర్ధ్వకేశి విరూపాక్షి- మాంసశోణితభక్షణే।
తిష్ఠ దేవి శిఖాబంధే- చాముండే హ్యపరాజితే॥
అపసర్పంతు తే భూతా- యే భూతా భూమిసంస్థితాః।
యే భూతా విఘ్నకర్తార- స్తే గచ్ఛంతు శివాజ్ఞయా॥
అపక్రామంతు భూతాని- పిశాచాః సర్వతోదిశం,
సర్వేషా మవిరోధేన- బ్రహ్మకర్మ సమారభే॥

యజు. స్యోనా పృథివి భవా నృక్షరా నివేశనీ, యచ్ఛా నశ్శర్మసప్రథాః

## గాయత్రీ ఆవాహనము

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా, బ్రహ్మ ఇత్యార్షం గాయత్రం ఛందం, పరమాత్మం సరూపం, సాయుజ్యం వినియోగమ్॥

ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మ సమ్మితం, గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వమే, యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిముచ్యతే, యద్రాత్రియా త్కురుతే పాపం తద్రాత్రియా త్ప్రతిముచ్యతే, సర్వవర్ణే మహాదేవి సంధ్యావిద్యే సరస్వతి॥

ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి, దేవానాం ధామ నామాసి, విశ్వమసి విశ్వాయుః, సర్వమసి సర్వాయు రభిభూరోమ్॥

గాయత్రీ మావాహయామి, సావిత్రీ మావాహయామి, సరస్వతీ మావాహయామి, ఛందర్షీ నావాహయామి, శ్రియ మావాహయామి.

గాయత్ర్యా గాయత్రీ ఛందో విశ్వామిత్ర ఋషిః, సవితాదేవతా అగ్నిర్ముఖం, బ్రహ్మశిరః, విష్ణు ర్హృదయ (గ్)ం, రుద్రశ్శిఖా, పృథివీ యోనిః. ప్రాణాపానవ్యానోదానసమానా సప్రాణా శ్వేతవర్ణా సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్వి (గ్)ం శత్యక్షరా త్రిపదా షట్కుక్షిః, పంచశీర్షోపనయనే వినియోగః.

## ఆచమ్య ప్రాణానాయమ్య

పూర్వోక్త ఏవం గుణ విశిష్టే శుభే అభ్యుదయ ముహూర్తే మమ ఉపాత్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ... ....... సంధ్యాంగం యథాశక్తి (108)(28) గాయత్రీ మంత్రజపం కరిష్యే ఇతి సంకల్ప్య.

## కరాంగన్యాసము

ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యాం నమః
ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే తర్జనీభ్యాం నమః
ఓం భర్గోదేవస్య రుద్రాత్మనే, మధ్యమాభ్యాం నమః
ఓం ధీమహి మహేశ్వరాత్మనే అనామికాభ్యాం నమః
ఓం ధియోయోనః సదాశివాత్మనే, కనిష్ఠికాభ్యాం నమః
ఓం ప్రచోదయాత్, పరశివాత్మనే, కరతల కరపృష్ఠాభ్యాం నమః
ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే, హృదయాయ నమః
ఓం వరేణ్యం విష్ణ్వాత్మనే, శిరసే స్వాహా
ఓం భర్గో దేవస్య రుద్రాత్మనే శిఖాయై వషట్.
ఓం ధీమహి మహేశ్వరాత్మనే, కవచాయ హుం

ఓం ధియోయోనః సదాశివాత్మనే, నేత్రత్రయాయ వౌషట్.
ఓం ప్రచోదయాత్ పరశివాత్మనే, అస్త్రాయ ఫట్.
భూర్భువః సువరోమితి దిగ్బంధః

## గాయత్రీ ధ్యానము

శ్లో॥ ముక్తావిద్రుమ నీలహేమ ధవళచ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిందు నిబద్ధ రత్నమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్॥
గాయత్రీం వరదాభయాంకుశకశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే॥
"త్రిశూలాక్షధరాం దక్షే-వామే సాభయశక్తికాం
రౌద్రీం ధ్యాయే వృషాబ్జస్థాం-త్రినేత్రాం చంద్రశేఖరామ్॥

బాలాం బాలాదిత్య మండల మధ్యస్థాం రక్తవర్ణాం రక్తాంబరాను లేపనస్రగాభరణాం చతుర్వక్త్రాం దండకమండల్వాక్షసూత్రాభయాంక చతుర్భుజాం హంసాసనారూఢాం బ్రహ్మదైవత్యా మృగ్వేద ముదాహరంతీం భూర్లోకాధిష్ఠాత్రీం నామ దేవతాం ధ్యాయామి.

### మధ్యాహ్న కాలమున

యువతీం యువాదిత్య మండల మధ్యస్థాం శ్వేతవర్ణాం శ్వేతాంబ రానులేపనస్రగాభరణాం చతుర్వక్త్రాం ప్రతివక్త్రం త్రినేత్రాం చంద్ర శేఖరాం త్రిశూలఖడ్గ ఖట్వాంగ డమర్వంక చతుర్భుజాం వృషభాస నారూఢాం రుద్రదైవత్యాం యజుర్వేద ముదాహరంతీం భువర్లోకాధి ష్ఠాత్రీం సావిత్రీం నామ దేవతాం ధ్యాయామి.

### సాయంకాలమున

వృద్ధాం వృద్ధాదిత్య మండల మధ్యస్థాం శ్యామాం శ్యామాంబరా నులేపన స్రగాభరణా మేకవక్త్రాం శంఖచక్ర గదా వరదాంక చతు ర్భుజాం గరుడాసనారూఢాం విష్ణుదైవత్యాం సామవెద ముదాహరంతీం. స్వర్లోకాధిష్ఠాత్రీం సరస్వతీం నామ దేవతాం ధ్యాయామి.

శ్లో. ఆగచ్ఛ వరదే దేవి- జపే మే సన్నిధౌ భవ
గాయంతం త్రాయసే యస్మాత్–గాయత్రీ త్వం తతఃస్మృతా॥

### గాయత్రీ మంత్రార్థము

శ్లో॥ దేవస్య సవితు ర్మధ్యే-యో భర్గో నో ధియః స్వయం।
ప్రచోదయా త్తద్వరేణ్యం-శరణ్యం నముపాస్మహే॥

## గాయత్రీ మహామంత్రము

ఓం భూర్భువః సువః, ఓం తత్సవితు ర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి యో యో నః ప్రచోదయాత్॥

## శివగాయత్రీ మహామంత్రము

"ఓం తన్మహేశాయ విద్మహే- వాగ్విశుద్ధాయ ధీమహి। తన్నః నః ప్రచోదయాత్" వస్త్రాచ్ఛాదిత హస్తపర్వభిః మాలయా వా జపం ధాయ పునః షడంగన్యాసం కృత్వా "భూర్భువస్సువరోమితి దిగ్విమోకః" ఇతి సముచ్చార్య "తత్సత్ బ్రహ్మార్పణమస్తు" ఇతి జలం సృజేత్.

## సూర్యోపస్థానము

౧. జాతవేదసే ఇత్యస్య మారీచః కశ్యపో ఋషిః, జాత వేదాగ్నిర్దేవతా త్రిష్టుప్ఛందః సూర్యోపస్థానే వినియోగః

ఓం జాతవేదసే సునవామసోమ మరాతీయతో నిదహాతి వేదః
సనః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితాత్యగ్నిః॥

ఋ. త్ర్యంబక మితి మంత్రస్య మైత్రావరుణి ర్వసిష్ఠో ఋషిః, అనుష్టుప్ ఛందః, సూర్యోపస్థానే వినియోగః

ఓం త్ర్యంబకం యజామహే - సుగంధిం పుష్టివర్ధనం, ఉర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మాఽమృతాత్॥

ఋ. తచ్ఛంయో రిత్యస్య మంత్రస్య శంయు ఋషిః, విశ్వే దేవాః దేవతా, శక్వరీ ఛందః, సూర్యోపస్థానే వినియోగః.

ఓం తచ్ఛంయో రావృణీమహే గాతుం యజ్ఞాయ, గాతుం యజ్ఞ పతయే దైవీ స్వస్తి రస్తు నః, స్వస్తి ర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతు భేషజం, శంనో అస్తు ద్విపదే శం చతుష్పదే॥

ఋ. నమో బ్రహ్మణే ఇత్యస్య మంత్రస్య ప్రజాపతి ఋషిః, విశ్వేదేవా దేవతా ; జగతీ ఛందః, సూర్యోపస్థానే వినియోగః.

ఓం నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః, నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే మహతే కరోమి (ఇతిత్రిః)

యజు. మిత్రస్య చర్షణీ ధృతశ్శ్రవో దేవస్య సానసిం, సత్యం చిత్రశ్రవస్తమం, మిత్రో జనాన్ యాతయతి ప్రజానన్ మిత్రో దాధార పృథివీ ముతద్యాం, మిత్రః కృష్టీ రనిమిషాభిచష్టే సత్యాయ హవ్యం ఘృతవ ద్విధేమ, ప్రసమిత్ర మర్తో అస్తు ప్రయస్వా న్యస్త ఆదిత్యశిక్షతి వ్రతేన, నహన్యతే న జీయతే త్వోతో నైన మగ్ంహో అశ్నో త్యంతితో న దూరాత్॥

## మధ్యాహ్నిక సూర్యోపస్థానము

ఋ. ఉదుత్యమితి త్రయోదశర్చస్య సూక్తస్య కాణ్వః ప్రస్కణ్వ ఋషిః శ్రీసూర్యోదేవతా, నవాద్యాగాయత్ర్యః అంత్యాశ్చతస్రోఽనుష్టుభః, సూర్యోపస్థానే వినియోగః.

ఓం ఉదుత్యం జాతవేదసం దేవం వహంతి కేతవః దృశే విశ్వాయ సూర్యం॥

ఋ. చిత్రం దేవానా మితి షడృచస్య సూక్తస్య ఆంగీరసః కుత్స ఋషిః, సూర్యోదేవతా, త్రిష్టుప్ ఛందః, సూర్యోపస్థానే వినియోగః. ఓం చిత్రం దేవానా ముదగా దనీకం చక్షు ర్మిత్రస్య వరుణ

స్యాగ్నేః, ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జ. త స్థస్తుషశ్చ.

యజు. ఓం ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ, హిరణ్యయేన సవితా రథేనా ౽౽ దేవో యాతి భువనా విప శ్యాన్॥

ఓం ఉద్వయం తమస స్పరి పశ్యంతో జ్యోతి రుత్తరం, దేవం, దేవత్రాసూర్య మగన్మ జ్యోతి రుత్తమం॥

ఓం తచ్చక్షు ర్దేవ హితం పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్, పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతం, నందామ శరదః శతం, మోదామ శరదఃశతం, భవామ శరదః శతగ్ం శృణవామ శరదః శతం, ప్రబ్ర వామ శరదఃశతం, అజీతా స్యామ శరదః శతం, జ్యోక్చ సూర్యం దృశే య ఉదగా న్మహతో౽ర్ణవా ద్విభ్రాజమానః సరిరస్య మధ్యా త్సమా వృషభో లోహితాక్షః సూర్యో విపశ్చి న్మనసా పునాతు॥

సాయంకాల సూర్యోపస్థానము

ఋ. ఇమంమే వరుణ తత్త్వాయామి త్యృచో రాజీగర్తిః శునః

శేప ఋషిః వరుణో దేవతా, ఆద్యా గాయత్రీ, ద్వితీయా త్రిష్టుప్, ఉపస్థానే వినియోగః

ఈ క్రింది రెండు మంత్రములు - ఋగ్వేదులకు యజుర్వేదుల కున్ను

1. ఓం ఇమంమే వరుణ శుధీహవ మద్యాచ మృడయ, త్వామవస్యు రాచ కే॥

2. ఓం తత్త్వాయామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానోహ విర్భిః అహేడమానో వరుణేహ బోధ్యురుశ (గ్)ం సమాన ఆయుః ప్రమోషీః॥

మరియు సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములను పఠింప వలెను.

దిఙ్నమస్కారము

ఓం నమః ప్రాచ్యై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివ సంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం నమో దక్షిణాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం నమః ప్రతీచ్యైదిశే, యాశ్చ

దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం నమ ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం ఊర్ధ్వాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం నమోఽధరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః॥ ఓం నమోఽవాంతరాయై దిశే, యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చనమః॥

## ముని నమస్కారము

నమో గంగాయమునయో ర్మధ్యే యే వసంతి తే మే ప్రసన్నాత్మాన శ్చిరం జీవితం వర్ధయంతి, నమో గంగాయమునయోర్మునిభ్యశ్చ నమో, నమో గంగాయమునయో ర్మునిభ్యశ్చ నమః

## దేవతా నమస్కారము

సంధ్యాయై నమః,సావిత్ర్యై నమః గాయత్ర్యై నమః,సరస్వత్యై నమః, సర్వాభ్యో దేవతాభ్యో నమః, దేవేభ్యో నమః, ఋషిభ్యో నమః, మునిభ్యో నమః, గురుభ్యో నమః, పితృభ్యోనమః, కామోఽకార్షీ న్నమో నమః, మన్యురకార్షీ న్నమోనమః.

## ఈశ్వర నమస్కారము

పృథివ్యాపస్తేజోవాయురాకాశాత్, ఓం నమో భగవతే సదా
।వాయ.

## గాయత్రీ ధ్యానము

యా(గ్)ం సదా సర్వభూతాని-చరాణి స్థావరాణి చ।
సాయంప్రాతర్నమస్యంతి-సా మా సంధ్యా అభిరక్షతో్యం నమః॥
త్తమే శిఖరే జాతే-భూమ్యాం పర్వత మూర్ధని।
బ్రాహ్మణేభ్యోభ్యనుజ్ఞాతా-గచ్ఛదేవి యథాసుఖమ్॥
స్తుతోమయా వరదా వేదమాతా ప్రచోదయంతీ పవనే ద్విజాతా।
ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యందత్వా ప్రయాతుం
బ్రహ్మలోకమ్॥

శ్లో, నమోఽ స్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే।
సహస్రనామ్నే పురుషాయ శంభవే
సహస్రకోటీ యుగ ధారిణే నమః॥

## భూమ్యాకాశాభివందనము

ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు, పితర్మాత ర్యదిహోపబ్రువే వాం భూతం దేవానా మవమే అవోభిః, విద్యామేషం వృజినం జీరదానుమ్॥

## ఋగ్వేదులకు

భద్రం న ఇతి మంత్రస్య ఐంద్రో విమదఋషిః, అగ్నిర్దేవతా, ఏకపదా విరాట్ ఛందః, శాంత్యర్థే జపే వినియోగః. "ఓం భద్రం నో అపి వాతయ మనః" ఓం శాంతిః శాంతిః శాంతిః॥

## ఈశ్వర ప్రార్థన.

శ్లో॥ విశ్వాధికస్యరుద్రస్య-కారణస్య శివస్య చ।
పరత్వం యే న జానంతి-రాక్షసా స్తేన సంశయః। 17

శ్లో॥ మహాపాపవతాం నృణాం-రుద్రాధిక్యం న భాసతే।
అనేక జన్మ సిద్ధానాం-శ్రౌతస్మార్తానువర్తినామ్।

శ్లో॥ రుద్రాధిక్యం స్వతోభాతి-ప్రమాణై రపి తర్కితః॥ 21
రుద్రః సంసారమగ్నానాం. సాక్షా త్సంసారమోచకః॥

శ్లో॥ అతః సర్వం పరిత్యజ్య- శివా దన్యత్తు దైవతమ్॥
శివ ఏకః సదా ధ్యేయః-లింగరూపీ ముముక్షుభిః॥ 23
సూతసంహిత-యజ్ఞవైభవఖండం-27 అ॥ 411 పుట

శ్లో॥ విహీనం వా సమంవాపి-హరిణా బ్రహ్మణా హరం।
యే పశ్యంతి తదా తే తు-పచ్యంతే నరకార్ణవే॥ 21

శ్లో॥ హరిబ్రహ్మాది దేవేభ్యః- శ్రేష్ఠం పశ్యంతి యే హరం।
తే మహాఘోరసంసారా-న్ముచ్యంతే నాత్ర సంశయః॥ 22
సూతసంహిత-సూతగీత-ఉపరిభాగము, 6 అధ్యా॥

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం-యథా గచ్ఛతి సాగరం।
సర్వదేవ నమస్కారః- శంకరం ప్రతి గచ్ఛతి॥

శ్లో॥ సర్వవేదేషు యత్పుణ్యం-సర్వతీర్థేషు యత్ఫలం।
తత్సర్వం సమవాప్నోతి-స్తుత్వా దేవం మహేశ్వరమ్॥

శ్లో, మహాదేవ మహాదేవ-మహాదేవేతి యో జపేత్॥
ఏకేనైవ లభేన్ముక్తిం-ద్వాభ్యాం శంభూ ఋణీ భవేత్॥

శ్లో. మహాదేవ విరూపాక్ష-గంగాధర మృడావ్యయ।
ఇతీరయంతి యే నిత్యం-తే కృతార్థా న సంశయః॥

శ్లో. మృత్యుంజయాయ రుద్రాయ-నీలకంఠాయ శంభవే।
అమృతేశాయ శర్వాయ- మహాదేవాయ తే నమః॥

శ్లో. హర శంభో మహాదేవ-విశ్వేశామరవల్లభ।
శివ శంకర సర్వాత్మన్-నీలకంఠ నమోఽస్తు తే॥

## శుభ చింతనము

శ్లో. ఆసత్యలోకా దాపాతాళా-దాలోకాలోకపర్వతాత్।
యే సంతి బ్రాహ్మణా దేవా-స్తేభ్యో నిత్యం నమోనమః॥
చతుః సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు.

## అభివాదనము

(ఆంగీరస గౌతమ ఆయాస్యత్ర్యార్షేయ) ...... ప్రవరాన్వీత, (గౌతమస) ......... గోత్రః, ఋక్శాఖా) ........ ....

ధ్యాయీ (ఆశ్వలాయన)........................ సూత్రః, (మల్లికార్జున పండితారాధ్య)............... వంశీయః... ....... శర్మా ఽహంభో అభివాదయే.

అనుచు స్వస్తికాకార హస్తములతో చెవులఁదాకి భూమిని స్పృశించుచు పరమేశ్వరునికి నమస్కరింపవలెను.

అనేన ......... సంధ్యావందనేన కర్మణా శ్రీ పరమేశ్వరః ప్రీయతామ్॥

"శంభవే స్వాహా" ఇత్యాది నామములతో ఆచమనము నొనర్చి "సర్వంశ్రీ సాంబసదాశివ చరణారవిందార్పణమస్తు" అనుచు ఉదకము విడువవలెను.

శివ ! శివ ! శివ ! శివ ! శివ !

## శ్రౌత శైవ సంధ్యావందన ముద్రణమునకు
## విరాళముల నొసఁగి
## మత్ విద్యావ్యాసంగమును ప్రోత్సహించు మహోదారుల
## శుభ ప్రియ నామధేయములు

శ్రీశ్రీ బెల్లం లక్ష్మీనరసింహారావుగారు, జనరల్ బజారు, సికింద్రాబాద్.

శ్రీశ్రీ దొంతుల (రేగుంట) హనుమాండ్లుగారి కుమారులు - నారాయణ, రామచంద్రం, బుచ్చయ్య, రామేశం, లక్ష్మణ గారలు, మెటుపల్లి (తాలూకా)

శ్రీ మాదాన్ భూమయ్య గుప్తగారు, మెటుపల్లి.

శ్రీ కొండూరి బసవరాజుగారు, వరంగల్. ప్రస్తుత నివాసము జగిత్యాల

శివశ్రీ ముత్యంపేట రాజేశ్వరశర్మగారు, కవాడిగూడ - శంకరమఠం, సికింద్రాబాద్.

శ్రీ మాడిసెట్టి వెంకటయ్యగారు, మెటుపల్లి.

శ్రీ మాడిసెట్టి రమణయ్యగారు, మెటుపల్లి.

శ్రీ వేంకటరమణ సిల్క్ హౌస్‌వారు, జనరల్ బజారు, సికింద్రాబాద్.

శివశ్రీ ముదిగొండ మార్కండేయులుగారు, హైకోర్టు జడ్జి, వెస్ట్ మారేడు [పల్లి, సికింద్రాబాద్.

శివశ్రీ శివలెంక మల్లికార్జునుడుగారు, సెకెండ్ బజారు, సికింద్రాబాద్.

శివశ్రీ ములుగు రామలింగంగారు, సెకెండ్ బజారు, సికింద్రాబాద్.

సూచన: ఇంక నెవరైన ఉదారులు-మా గ్రంథమాలకు - ఈ గ్రంథం అచ్చుపడిన తరువాత విరాళముల నొసఁగిన యెడల - రాబోవు గ్రంథమునందు వారి శుభ నామధేయములు ప్రకటింపఁబడును.

నిర్మల శంకరశాస్త్రి

11-4-1981



కీ॥ శే॥ శ్రీ॥ నిర్మల, అన్నపూర్ణమ్మగారు

శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః

# అమ్మ-ఎడబాటు-ఆవేదన

శివేచ్ఛయే- జ్ఞాన సహకారమున- క్రియాశక్తిగా పరిణమిం
జగమును నిర్మించును శివాంశలగు జీవులు- అనాదికాలము నుం

భ్రమ ప్రమాదాలకు లోనై మానవ పశుపక్ష్యాది జన్మలయందు వెతలఁ జెందుచుందురు. జగము అనగా జీవాత్మలు- ప్రకృతితో పంచభూతాల తోడను జ్ఞాన కర్మేంద్రియాలతోడను మేళవించియుండు తతంగమని తెలియనగును. ఐతే ఈ మేళవింపులో కొందరు జీవులు- శరీరేంద్రియాదుల సంబంధమును సార్థకముఁ జేసికొనుటకు నశ్వర శరీరముతో క్షణిక ఇంద్రియ సంబంధముతోడను అనశ్వరము కాలాతీతము నగు పరమపదము నధిష్ఠింప నుద్యుక్తులై శాంభవ దీక్షఁ బరిగ్రహించి శివు నారాధించు పురుషోత్తములుగ నుందురు. ఇట్టి పురుషోత్తములే ఆరాధ్యులనియు, శ్రౌతశైవులనియు చెప్పఁబడుదురు. ఆరాధ్యులలో- స్మార్తాచారాన్ని పాటిస్తూ షట్కాలములయందుగాని త్రికాలములయందు గాని కాల ద్వయమునఁగాని ఏకకాలమునందుగాని ఇష్టప్రాణభావ లింగాత్మకుఁడగు శివు నర్చించుచు శీలసంపన్నులై సదాచారులునై యుండువారు- అగ్రగణ్యులని చెప్పవచ్చును. త్రిలింగ (తెలంగాణ) దేశమునందు ఆంధ్ర మహారాష్ట్రముల సరిహద్దగు ఆదిలాబాదు మండలము (జిల్లా) లోని, తాలూకా నిర్మలయందు శివశ్రీ అంబికేశ్వరారాధ్యులవారికి— అనుజపుత్రుడగు- రామనాథారాధ్యులు- దత్తపుత్రుఁడుగా వెలసి— ప్రథమ పత్నియందు సంతానమును త్వరలో బడయనందున- నందగిరి వీరభద్రస్వామి నారాధించి వరములఁ బడసిన ఆరాధ్యశిఖామణి యనఁ

బడుచుండెను. అట్టి వరముల నాలుగిటిలో మొదటి వరము మొదట భార్యయందు సత్పుత్రరూపముగ ఫలింపగా మిగతవి ఫలించుటకు శ్రీవారు-' ఆమె తోబుట్టువును రెండవ భార్యగా పరిగ్రహింపవలసి వచ్చెను. అదిగో ఆమెయే మా అమ్మ. పేరు-అన్నపూర్ణమ్మ, ఈపెద- చిన్నతనములో పెద్ద వయసువానితో పెండ్లి చేసికొని పతివ్రతయై పతి సేవఁ జేయుచు కొద్ది వత్సరములలోనే ముగ్గురిని కని- నిండు యౌవ్వ నమున పతి వియోగమును పొందినను ఒక్క కూతురు, ఇద్దరు కుమా .రులే సర్వస్వ మనుకొని శీలముతో కాలముఁ గడిపిన మహానుభావురాలు నిష్కపట స్వభావురాలై స్వార్థ దురాశను విడనాడి తన సంతానమునకు విద్యాబుద్ధులు వివాహములు ఆర్థిక స్తోమత మొదలగు సౌకర్యములు సమకూరుటకై పరమేశ్వరుని ప్రార్థించుచు సవతి కుమారుని కన్న కొడుకునువలె గాంచుచు కుయుక్తులు లేనిదై కుమారులు విభాగముఁ జెందిన పిదపగూడ పెద్దవాడనగు నా యొద్దనే ఎక్కువకాలము నివ సించుచు పరులను బాధింపకుండినది.

ఈమె జీవితము-పవిత్రము, ఇతర వనితలకు ఆదర్శప్రాయము నని చెప్పవచ్చును. శివశ్రీ కోణ సముద్రం గంగాధరయ్యగారికి కడపటి కూతురు- మా అమ్మ; తన నెవరేమి యనినను ఓర్చుకొని "శంకరా!"

నన్నెప్పుడు రప్పించుకొనెద"వని ఆర్తనాదముతో విలపించుచు చివరి దశలో అనారోగ్యముతో బాధపడుచుండెను. కుమారులు సన్నిహిత బంధువులును ఒకవంక ఈమెయందు పూజ్యభావము గలవారై మరొక వంక విసుగుపడుచుండిరి. ఐనను పాపము! మా అమ్మ- ఎవరిని ఎట్టి దుడుకు మాటలు అనకుండా తన యనుభవమునకు లోలోన కుందు చుండెడిది.

అట్టి మా అమ్మ ముగ్గురమ్మల మేళనముగల దివ్యమూర్తి- 82 సం॥ల 10 నెలల జీవనమును ముగించి రౌద్రి సం॥ పుష్య బ॥ అష్టమి బుధవారం 28-1-1981 పగలు 3 గం॥ల 10 ని॥లకు మా యందరిని వీడి పునరావృత్తి రహిత శాశ్వత శివపదంబగు మహా కైలాస మునకుఁ జని మమ్ము దుఃఖసాగరములో ముంచినది.

దుఃఖాన్ని దిగమ్రింగి మేమందరము ఆమె ఆత్మశాంతిని కోరుచు పరస్పర సామరస్యముతో శేష జీవనమును కోపతాప రహిత ప్రశాంత వాతావరణమునందు గడుపుచు అమ్మకు శివమేధముతో శివస్వరూపా నందములు లభించుటకు శివుని వేడుదుము గాక !

అమ్మ - శివరూపముతో మమ్మందరి నాశీర్వదించుచు రక్షించు గాక !

ఇట్లు
**నిర్మల శంకరశాస్త్రి**
8-2-1981

ఆటవెలది - తల్లి మొదటి వేల్పు ధర్మశాస్త్రంబుల
తల్లి లేనివాని తనువదేల
తల్లి యుండవలయు తనయుని కటుగాక
తల్లి వలయు మనుజ తతులకెల్ల. ॥26॥

సానందోపాఖ్యానము, పంచమాశ్వాసము, పుట 100;

శ్రీ

గాయత్రి సంధ్యోపాసనమును గావించినవారు - విద్యాధన సమృద్ధికొరకు శ్రీ మేధా దక్షిణామూర్తి మహామంత్రమును — ప్రతి దినము - ఉదయ సంధ్యావందనము కాగానే 108 పర్యాయములు - వీలులేనిచో 28 సార్లు జపించవలసియుండును.

ధ్యాన శ్లోకము

స్ఫటికరజతవర్ణం మౌక్తికీ మక్షమాలాం
అమృతకలశవిద్యాం జ్ఞానముద్రాం కరాబ్జైః ।
దధత మురగకక్షం చంద్రచూడం త్రినేత్రం
విధృత వివిధభూషం దక్షిణామూర్తి మీడే ॥

"ఓం నమో భగవతే దక్షిణామూర్తయే
మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా"

జపానంతరము ధ్యానశ్లోకమును చదివి శ్రీ దక్షిణామూర్తికి మ్రొక్కవలెను.

ఈ మంత్రమునకు - బ్రహ్మదేవుఁడు ఋషి; గాయత్రీ ఛందస్సు; దక్షిణామూర్తి యగు శంకరుఁడే దైవము, అని భావింప వలెను.

గురూపదేశముగ ఈ మంత్రమును స్వీకరించి జపించినచో శీఘ్రము సిద్ధించును.

బ్రహ్మచారులకు, విద్యార్థులకును ఇది మిగుల నుపయోగించును.

---

# శని స్తోత్రము

శ్లో॥ నమః కృష్ణాయ నీలాయ - శిఖిఖండ
నిభాయచ । నమో నీలమధూకాయ -
నీలోత్పల నిభాయ చ ॥ నమో నిర్మాంస
దేహాయ - దీర్ఘ శ్రుతి జటాయ చ । నమో
విశాలనేత్రాయ - శుష్కోదర భయానక ॥
నమః పౌరుషగాత్రాయ - స్థూలరోమాయ
తే నమః ॥ నమో నిత్యం క్షుధార్తాయ -
నిత్య తృప్తాయ తే నమః ॥ నమోఽఘోరా
య రౌద్రాయ -భీషణాయ కరాళినే ।
నమో దీర్ఘాయ శుష్కాయ -కాలదంష్ట్ర
నమోస్తు తే ॥ నమస్తే ఘోరరూపాయ -
దుర్నిరీక్ష్యాయ తే నమః । నమస్తే సర్వ
భక్షాయ - వలీముఖ నమోస్తుతే ॥
సూర్యపుత్ర నమస్తేస్తు - భాస్వరోభయ

దాయినే । అధోదృష్టే నమస్తేస్తు - సంవ
ర్తక నమోస్తుతే॥ నమో మందగతే తుభ్యం
నిష్ప్రభాయ నమో నమః । తపసా జ్ఞాన
దేహాయ - నిత్యయోగరతాయచ ॥
జ్ఞానచక్షు ర్నమస్తేస్తు - కశ్యపాత్మజ
సూనవే । తుష్టో దదాసి రాజ్యం త్వం
కృద్ధో హరసి తత్క్షణాత్ ॥ దేవాసుర
మనుష్యాశ్చ - సిద్ధ విద్యాధరోరగాః ।
త్వయాఽవలోకితాః సౌరే -దైన్యమాశు
వ్రజంతితే॥ బ్రహ్మ శక్రో యమశ్చైవ
మునయః సప్తతారకాః । రాజ్యభ్రష్టాః
పతంతీహ - తవ దృష్ట్యాఽవలోకితాః ॥
త్వయాఽవలోకితాస్తేఽపి - నాశం
యాంతి సమూలతః । ప్రసాదం కురుమే
సౌరే - ప్రణత్వా హి త్వ మర్థితః ॥

ఈ స్తోత్రమును ప్రతి దినము పఠించు వారికి అర్థాష్ట అష్ట శని పీడ, సాడేసాత్ శని పీడ యుండజాలదు.

---

# ప్రకటన

వర్ధిత గ్రంథమాలా పుష్పములలో ఇది నాలుగవది. ఏతత్పూర్వము నీలకంఠీయ బ్రహ్మసూత్ర భాష్యాంధ్రానువాదము మొదలగు 13 గ్రంథములు మరియు శివాద్వైత సంఘమువారి శివజ్యోతి వార్షిక సంచికలు మూడు ప్రచురింపబడినవి. శ్రౌత శైవుల సదుపయోగార్థము సోమవారవ్రతోద్యాపనము వ్రాయబడును గాన శైవులు సారస్వత ప్రియులు వర్తకశిఖామణులు వైదిక బ్రాహ్మణులు విద్వత్ప్రియులు విద్యాపోషకులును ఈ గ్రంథము అందుచతోడనే తమ శ్రీముఖము ద్వారా విరాళములను తెల్పవలయునని కోరుచున్నాను





నిర్మల శంకరశాస్త్రి

సర్వమంగళాసదనము,
184/A, వెస్ట్ మారేడుపల్లి,
సికింద్రాబాద్ 500 026 (A.P.)